# హైదరాబాదునగర
# బిర్లామందిర వేంకటేశ్వర శతకము




రచన

డాక్టర్ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి.

# హైదరాబాదు నగర
# బిర్లామందిర వేంకటేశ్వర శతకము





రచన

డాక్టర్ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి,
ఎ ఏ పిహెచ్ డి



సాహిత్యసభా ప్రచురణ - హైదరాబాదు

# HYDERABADU NAGARA
# BIRLAMANDIRA VENKATESVARA SATAKAMU

By Dr OGETI ACHYUTARAMA SASTRY M A Ph D

---


2000 Copies
First Edition August 1987



*Published by*

SAHITYA SABHA Hyderabad 500 482

*Copies Available at*

Dr OGETI ACHYUTARAMA SASTRY
H No 8 2 46 Pratap Nagar
Punjagutta Hyderabad 500 482

Price Rs 5/

*Printed at*

Ambareesha Enterprises (Printers & Binders)
Bholakpur Secunderabad 500 380
Phone 831257

# మనవి

ఈ హైదరాబాదు నగర బిర్లామందిర వేంకటేశ్వరశతకమును పాఠకులు కర కమలముల నందించుచున్నందుకు మహదానందముగ నున్నది దీని రచనకు దారితీసిన సంఘటన మిక్కిలి ఆశ్చర్య జనకమైనది!

అది 1986 ఆగష్టు 2వ తేది నా పుట్టినరోజు ప్రతి సంవత్సరమువలె ఆనాడు కూడ బొలారమునందలి డౌటన్‌రోడ్డు దగ్గర వందసంవత్సరములనాడు మా పూర్వీకులు కట్టించిన శివా లయమునకు వెళ్ళి స్వామిని సేవించి తిరిగివచ్చుచు మార్గమధ్య ములోనున్న బిర్లామందిర వేంకటేశ్వరు కూడ దర్శించుటకు వెళ్ళి తిని నేను బిర్లామందిరమును దర్శించుట అది మొదటిసారి ఆ మందిరనిర్మాణము స్వామి స్వరూపము వందలకొలదిగవచ్చు భక్త బృందముల కోలాహలము నన్ను పరవశుని చేసినవి దీనికితోడు నేను 1949 మె నెలలో కాలినడకన మొటమొదటిసారి తిరుమలకు వెళ్ళి వెంకటేశ్వరు సేవించిన సంఘటన ఆ యనుభూతులు ఒక్కుమ్మడిగ తలపునకువచ్చి మైమరచితిని! అవితర్కితముగ నా నోటినుండి బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ! అన్న మకుటము వెలువడినది! అప్పటికప్పుడు అక్కడికక్కడ మొదటి పది పన్నెండు పద్యములు చెప్పితిని! తరువాతి వారము రోజులలో శతకము పూర్తియైనది నా సాహిత్య రచనావ్యాసంగమున జరిగిన సంఘటనలలో ఇదొక అద్భుతరమణీయమైన సంఘటన!

ఆ వెంటనే యిది విశ్వహిందు తెలుగుమాసపత్రికలో 1986 నవంబరు దీపావళి విశేషసంచికనుండి 1987 జూలై సంచిక వఱకు - మధ్యలో రెండు సంచికలు తప్ప - ఏడు సంచికలలో నోట్సుతోసహా ధారావాహికముగ ప్రచురింపబడినది! ఇట్లు ఈ శతకమును తొలుత వెలుగులోనికి తెచ్చిన సదరు పత్రికా సంపాదకులు శ్రీ కె బి సోమయాజులుగారికి సహాయసంపాదకులు శ్రీ ఎంగళి సుందరరావు గారికి కృతజ్ఞతాళి వందనములు సమర్పించుచున్నాను సకాలములో ఇల్లు అందముగా ముద్రించి యిచ్చిన అంబరిష ఎంటర్‌ప్రైసెస్ ముద్రణాలయము వారికి ధన్యవాదములు సమర్పించుచున్నాను

ఈ శతకమున వెంకటేశ్వరుడు హరిహరస్వరూపుడుగ వర్ణింపబడుట మొదటివిశేషము! అతని చుట్టును కొన్ని చరిత్రాంశములను నగరవిశేషములను అల్లి సమన్వయాత్మకముగ వర్ణించి చెప్పుట మరొకవిశేషము! వేంకటేశ్వరుడు వస్తుతః హరి హరస్వరూపుడనియు తిక్కన తన భారతమును అంకితమిచ్చిన హరిహరనాథుడు వెంకటేశ్వరుడే యనియు గతపదిసంవత్సరములుగ నేను పరిశోధించి కనుగొన్న విషయము ఆమేఱకు ఏనాడో కొన్ని వ్యాసములను వ్రాసి ప్రకటించితిని 1986లో ఓగేటివ్యాసపీఠి అన్న పేరుతో పుస్తకమును ప్రచురించితిని ఇది తిరుగులేని సిద్ధాంతమగుటవలన వేంకటనాథుని హరిహరనాథునిగా వర్ణించితిని దీనికి తోడు 1985లో "హైదరాబాదునగర తెలుగుభాషా సాహిత్య వికాసచరిత్ర" అను గ్రంథమునొకటి వ్రాసితిని అప్పుడు నా దృష్టికివచ్చిన కొన్నిచరిత్రాంశములను ఎన్నుకొని ఇచ్చట స్వామికి

సమన్వయించి వర్ణించితిని ఒకవైపున అలౌకికమగు వెంకటేశ్వర గత హరిహరతత్త్వరహస్య నిరూపణము మరొకవైపున లౌకిక మగు కొన్నిచరిత్రాంశముల సమన్వయ విధానము, ఇవి యీ శత కమునందలి విశేషలక్షణములు' ఇందలి సామరస్యమును పాఠకులు తమ యనుభూతికి తెచ్చుకొనగలరని ఆశించుచున్నాను

ఈ శతకమునువిన్న కొందరు మహనీయులిట్లనిరి పూజ్యశ్రీ డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు గారు- ఇదొక క్రొత్తపద్ధతి శతకము ఆక్రొత్తదనమున తత్త్వమునందును దానిని ప్రతి పాదించిన తీరునందును హృదయములనులోగొను లలితమధురశైలీ విన్యాసమునందును చూడగలము! ప్రఖ్యాత కవి శ్రీ నీలా జంగయ్య గారు- ఇది వండి పాకముబట్టి ఏ మాగబెట్టిన కవిత్వమో కాదు హైయంగవీనము వంటిది- అప్పుడే తీసిన వెన్నగాచిన కమ్మని ఆవునెయ్యి వంటిది! విద్వత్కవి డా॥ గోలివేంకటరామయ్య గారు- ప్రతిపద్యమునందును ఏదోఒక భావవైచిత్రి ఉక్తివైచిత్రి తళుక్కు మనుట ఇందలి విశేషము గొప్పశతకము! సాహితీసహృదయులు శ్రీ ఆర్ వాసుదేవరెడ్డి గారు- ఈ తేటగీతులలో తేటులు పాటలు మ్రోయుచున్నవి వేమన ఆటవెలదివలె ఓగేటి తేటగీతి ప్రసిద్ధి వహించుట ఖాయము!

ఈ శిల్పామందిర వెంకటేశ్వర శతకము మీ హృదయ పీఠములందున్నది సెలవు

హైదరాబాదు
2 ఆగష్టు 1987

ఓగేటి అచ్యుతరామ శాస్త్రి



# హైదరాబాదునగర బిర్లామందిర వేంకటేశ్వర శతకము

## ఆవాహన

హైదరాబాదు నౌబత్పహాడ పైన[1]
బిర్లమందిరమదె! యందువెలసియున్న
వేంకటేశ్వరుఁగొల్చిన వేడ్కలోన
పద్యశతకంబుఁజెప్పెదఁ బరవశించి

---

1 కాలాపహాడుపైన అని పాఠాంతరము దీనికి నీలాద్రి యన్నది యనువాదము అసలు ఈ మొత్తము కొండగుట్టకు స్థూలముగా నౌబత్పహాడనియే పేరు కాని యిప్పుడు వేంకటేశ్వరుడు వేంచేసియున్న భాగమును కాలాపహాడు (నీలాద్రి) అనియు ఆ ప్రక్కనే "ప్లానెటోరియం" నెలకొనియున్న భాగమును నౌబత్పహాడనియు వ్యవహరించుటకద్దు ఈ శతకమున మాత్రము ఈ రెండు పేర్లు మొత్తం కొండగుట్టకు సమానార్థకములుగా ప్రయోగింపబడుచున్నవని తెలియగలరు

అలబొలారంబుగు శివయందువలరుచున్న [2]
మాదుయిలవేల్పు శివుని యామోదమంది
భేదమెఱుగని భక్తితో వేంకటేశు
గానమొనరింతు కమ్మనికవితలందు

తేటగీతుల మఱి తేటతెలుగులోనఁ
దెలియఁబఱతును తత్త్వంబుఁదెలిసినంత
నీటికొందిగఁదామరన్ మాటవినమె
దూఁనపోసెద హృదయంబు దొరపదముల

తిక్కయజ్వతోవంతుకైదిగుటకాదు [3]
అన్నమయ్యతో పొత్తుకైయసలెగాదు
కలినివేంకటనాయకు ఘనతనెంచి
వేల్పుదొరగొల్పు వెచ్చనౌవేడ్కగాని

2 క్రీ శ 1855వ సంవత్సరములో బొలారము న దలి డౌబెన్ రోడ్డు దగ్గఱ మాతాతగారు శ్రీ ఓగేటి సీతారామయ్యగారు కట్టించిన శివాలయము

3 తిరుమల వేంకటేశ్వరతత్త్వమే తిక్కనగారి హరిహరనాథతత్త్వము। తిక్కన తన భారతమును అంకితమిచ్చినది తిరుమల వేంకట నాథునికే ఆతని భారతము నందలి ఆశ్వాసాద్యంత పద్యములన్నియు వేంకటేశ్వరుని సంబోధించి చెప్పనవేయనుట సిద్ధాంతము వివరములకు చూడుడు నేను వ్రాసిన "ఓగేటి వ్యాసపీఠి" అను గ్రంథమును ప్రాచీన తమిళాంధ్ర సాహిత్యములను శాసనములను చరిత్రను తిక్కనగారి హరిహరనాథ పద్యములను ఇంకను అనేక విషయములను కూలంకషముగ మథించి ప్రామాణికముగ నిర్ధారించి 108 పుటలలో వ్రాసిన వ్యాసపీఠి

హృదయముప్పొంగ( జెప్పెడి కృతియగాని
కవినికాగోరుకాంక్షతో(గాడుసూవె !
తెలియరో నన్ను మీకింత తెలుపనేల
అజ్ఞానతంచువేడెద( బ్రాజ్ఞవరుల

క్ష మా ప ణ

వేంకటేశ్వరుగుడులెన్నొ వెలయవచ్చు[4]
వచ్చునే సరి తిరుమలస్వామి ంచు
తొలుతనొల్లక మలుత నిన్ తెలిసకొంటి
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

4 ఈ బిర్లామందిర నిర్మాణము పూర్తియైన పిమ్మట 1976 ఫిబ్రవరి 13వ తేదీన ప్రతిమ దర్శనమునకు ప్రారంభోత్సవము జరిగినది అది మొదలుకొని 1986 ఆగష్టు 2వ తేదీ వఱకు ఈ పది సంవత్సరములలో నేను స్వామి దర్శనమునకై వెళ్ళలేదు 1986 ఆగష్టు 2వ తేదీన నా పుట్టిన రోజు పండుగయగుటవలన అనుకోకుండగ బుద్ధిపుట్టి స్వామి దర్శనమునకై తొలిసారి వెళ్ళితిని స్వామిని చూడగానే ఒక్కసారి హృదయముప్పొంగినది బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!" అన్న మకుటము ప్రత్యక్షముగ వెలువడి యీ శతకమావిర్భవించినది ఇంతకాలము స్వామి దర్శనమునకై వెళ్ళనందుకు క్షమాపణ కోరటమైనది

## వేంకటేశ్వర తత్త్వము

బాలవు కుమారుడవు వీరభద్రుడవంద్రు[5]
హరివి హరుడవు మఱి హరిహరుడవంద్రు
అరయ వారిహరరూపుడవనుట నిజము
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

శేషశేషిత్వభావనాస్థితినిఁదలచి[6]
యెప్పుడెట్లెట్లువలయునో యప్పుడట్లు
నీదుమూర్తుల వర్ణనల్ నెఱపుదిచట
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

---

5 వేంకటేశ్వరుని పూర్వరూపముల చరిత్ర వివరములకు చూడుడు నా "ఓగేటి వాసపీరి" అను గ్రంథమును

6 శేషమనగా అప్రధానమనియు శేషియనగా ప్రధానమనియు అర్థము వేంకటేశ్వరుడు హరిహరుడని భావించినపుడు హరిహరుడే ఏకదేశిగా హరిగా భావించినపుడు హరుడు అప్రధానమగును హరుడుగా భావించినపుడు హరి అప్రధానమగును ఇది హరిహరులిరువురకూ సాధారణమైన మహాలక్షణము దీనిని శేషశేషిభావతత్త్వమందురు

ఈ తత్త్వమును ప్రాతిపదికగా పెట్టుకొని ఈ శతకమున వేంకటేశ్వరుని ప్రధానముగా హరిహరుడుగా వర్ణించినప్పటికిని కొన్ని సందర్భములందు ఏకదేశిగా హరిగాను మరికొన్ని సందర్భములందు హరుడుగాను వర్ణించుట జరిగినది

ఈ శేషశేషిభావ తత్త్వమును గూర్చి మరింత తెలిసికొనగోరువారు జగద్గురు శ్రీ శంకర భగవత్పాదుల వారి సౌందర్యలహరిలోని శేషవ శ్లోకమును అధ్యయనము చేయగలరు **

## మందిర స్థితి వర్ణన

భాగ్యనగరంబులోఁ జూడవలసినట్టి
తావులెవ్వియొ ముందుగాఁదలచివచ్చు
ప్రజలు నిన్జూడఁ దహదహ వత్తురిటకు
బిర్లమందిరవాస శ్రీవేంకటేశ !

నాల్గువైపులమార్గముల్ నడుమకొండ
తిరుగుదురయా తె ! నీచుట్టుతెలియకుండ
నవియెనాగ ఁబదక్షిణలనగజనులు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

నగరమందలి యేమూలయగునుగాక
కానుపింతువు నీవహో ! కరుణఁదలచి
దొరికెఁబో నీకు ననువైనదొడ్డతావు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

నీదుసన్నిధినిముసంబు నిలిచియుండి
కలయఁజూచిన నగరంబుకానుపించు
నగరలక్ష్మిసనాధయై నెగడుననగ
బిర్లమందిరవాస శ్రీవేంకటేశ !

నగరమందలి నడిబొడ్డు నగమునుండి
వెలుగురేకలచిఱుజల్లునొలకరించి
పులకరింపఁగఁజేతువు పురినిజనుల
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

స్వామి రాంకు కాళణములు

రాజధానిగ తిరుపతిరాకపోవ[7]
రాజధానికె దిగివచ్చె రమణీయనగ
మమ్ము(బాలింపవచ్చితోమనసువలగ
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

భాగమతియన్న హైందవభామ పేర
భాగ్యనగరంబు నిర్మింపబడియెనగుట
సిరియు గౌరియు వెంటరాన్ వరలినావొ
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

నౌబతను మాట నవభక్తి నాగపలుకు[8]
శబ్దసాదృశ్యమో మరి స్థానమహిమొ
పట్టిలాగెను కాబోలు వచ్చితివు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

---

7 1953లో ఆంధ్రరాష్ట్రము ఏర్పడనున్న సందర్భములో తిరుపతిని రాజధానిగా చేయవలెనని కొందరు నాయకులు సూచించిరి కాని అప్పుడు మొదట కర్నూలు ఎమ్మట హైదరాబాదు మన రాజధానియైనది

8 నౌబత్ = వికృతి నవభక్తి = ప్రకృతి అపభ్రంశమెట్లున్ననూ ఇదొక చమత్కారపు టూహ

గోలకొండనవాబుల పాలనములో[9]
అసఫుర్ఝు వంశరాజుల నాలనములో
పూర్వపరిచితి మనకంచుపురముసారితె !
దీర్ఘమందిరవాస ! శ్రీవేంకటేశ !

ఇబ్రహీ-మయ్యెనిభరాముడబ్రముగను[10]
తానషాకయ్యె రామునిదర్శనంబు
చిత్రమీభూమి యంచును చెరినావా
దీర్ఘమందిరవాస ! శ్రీవేంకటేశ !

అడుగా ! అక్కన్నమాదన్నయన్నదములు
రాజకరణనీతిశాస్త్ర రారాజితుండ్రు
అట్టివారలు పుట్టిన యవనిదిగితె
దీర్ఘమందిరవాస ! శ్రీవేంకటేశ !

అడుగా ! గోపన్న, గోల్కొండయటకలోన[11]
వానిదర్శించి కరగు శివాజి యడుగొ
భక్తిరససిక్తధరణిపై రక్తిగాంచె
దీర్ఘమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

9 గోల్కొండ కుతుబ్షాం పాలనలోను హైదరాబాదు నిజాం నవాబుల పాలనలోను ఒరుపతి అంతర్భాగముగా నుండినట్లు చరిత్ర

10 గోల్కొండ సుల్తానులలో మూడవవాడైన ఇబ్రహీం కులీ కుతుబ్షాకు "ఇభరాముడు" మల్కిభరాముడు అను బిరుదులుండెను. వివరములకు చూడుడు నేను వ్రాసిన "హైదరాబాదు నగర తెలుగు భాషా సాహిత్య వికాస చరిత్ర" అను గ్రంథమును

11 శివాజీ గోల్కొండకు (హైదరాబాదుకు) వచ్చినప్పుడు జైలులో ఉన్న రామదాసును దర్శించి ద్రవించిపోయినట్లూహింపబడినది

భక్తి కళయింపఁజల్లె గోపన్న యిచట[12]
రాముచరణాంకములు తీర్చెరంగవల్లి
గొబ్బిదేవరవై వచ్చి కూరుచుంటి
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

ఛత్రపతివంపెభక్తితో స్వర్ణకంఠి [13]
ఆతడుతాకిననేలపై నవతరింతు
ననుచు వేంచెసతౌర నీవనగఁజెల్లు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

12 గొబ్బదేవతవై అని పాఠాంతరము గొబ్బెమ్మ స్త్రీ దేవత కాగా ఇక్కడ వేంకటేశ్వరతత్త్వము బాలాతత్త్వమని తెలియవలెను

13 శివాజి 1674 జులైలో గోల్కొండకు (హైదరాబాదుకు) వచ్చెను హైదరాబాదునుండి శ్రీశైలమునకు వెళ్ళెను అక్కడి నుండి తిరుపతికి వెళ్ళవలెనని యనుకొనెను కాని అతి త్వరముగా కర్ణాటకకు వెళ్ళవలసి వచ్చినది అప్పుడు తన ప్రతినిధి ద్వారా వేంకటేశ్వర స్వామికి కొన్ని కైంకర్యములను పంపించెను అందులో బంగారు కంఠాభరణమొకటి ఇది కారణముగ శివాజీయన్న స్వామికి మిక్కిలి వాత్సల్యము కాగా శివాజీ కాలుబెట్టిన హైదరాబాదుకు స్వామి ఎంతో కుతూహలముతో వేంచేసినాడు

విశ్వయోగి వివేకుడు విశ్వకవియు[14]
మాలవీయ మహాత్ములు మసలినట్టి
మంచితావిదియంచు నేతెంచినావా
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

14 శ్రీ వివేకానందులు 1893 ఫిబ్రవరి 10 17 తేదీలలో హైదరాబాదులో నుండిరి 13వ తేదీనాడు సికిందరాబాదు మహబూబ్ కళాశాలలో My mission to the west అన్న యంశముపై ప్రసంగించి సభాసదులను సమ్మోహితులనొనర్చిరి

శ్రీరవీంద్రులు హైదరాబాదు వచ్చినపుడెల్లనూ శ్రీమతి సరోజనీ నాయుడు ఇంటిలో (Golden Threshold) వారి అతిథిగా నుండెడివారు 1940లో జరిగిన ఉస్మానియా విశ్వవిద్యాలయము స్నాతకోత్సవమునకు వచ్చి ఉపన్యసించిరి

శ్రీ మాలవియ 1915లో హైదరాబాదుకు విచ్చేసిరి కాశీ విశ్వవిద్యాలయమును స్థాపించుటకు పూనుకొన్న ఎమ్మట విరాళములను సేకరించు యత్నములో వచ్చిరన్నమాట అప్పుడు 7వ నిజాం ఉస్మానాలీ ఖాన్‌తో సహా పలువురు పురప్రముఖుల వారు కలుసుకొనిరి

శ్రీగాంధీజీ 1919 ఏప్రిల్ 1వ తేదీనాడు తొలిసారి హైదరాబాదుకు వచ్చిరి 1930 1934 సంవత్సరములలోను ఆదరిమిలాకూడ వచ్చిరి వచ్చినప్పుడెల్ల సరోజనీనాయుడు గారింటనే బసచేయుచుండిరి 1934లో వచ్చినప్పుడు వివేకవర్ధినీ ప్రాంగణములో ప్రసంగించిరి Golden Threshold లో ఒక మామిడి మొక్కను నాటిరి

అలకిషన్ ప్రసాద్బహదురు అంతటిఎప[15]
కాలె శవమెల్ల కుడిచెయి కాలదహహ !
దానవీరునిధరయంచు దరలినావొ
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

భరతకోకిల యలనాటి పాట దలచి[16]
నీదు బంగారువాకిలి నీడుకొంచు
నడచివచ్చితె బంగారుగడపలోకి
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

15 మహారాజాకిషన్ ప్రసాద్ బహద్దరు మహనీయుడు 6వ నిజాం మహబూబాలిఖాన్ కాలములో 1901 1911 వరకు పదేళ్ళను 7వ నిజాం ఉస్మానాలీఖాన్ కాలములో 1926 - 1936 మధ్య పదేండ్లును ప్రధాన మంత్రిగా పనిచేసిరి సంస్కృతాంధ్ర ఆంగ్ల హిందీ ఉర్దూ పారశీక భాష లలో దిట్ట గొప్పదాత ఆయన మరణించినప్పుడు శవమంతయు దహనమైనది కుడిచేయి మణికట్టు అరవేయి వ్రేళ్ళ మొదలగు భాగ ములు మాత్రము కాలలేదు రెండవసారి మరల దహనము చేసిరి అయి ననూ కాలలేదు అప్పుడు దైవజ్ఞులు ప్రభుత్వాధికారులు బంధువులు ప్రజలు ఆ చేతితో నాతడు ఎన్నియో దానములు చేసినాడు అందువల్లనే అది కాలలేదు అమరమైనది ! అని జయజయ ధ్వానములుచేసిరి ఈ మహనీయుడు 1940లో దివంగతుడయ్యెను

16 శ్రీమతి సరోజినీనాయుడికి "భారతకోకిల" అను బిరుదమున్నది ఆమె హైదరాబాదు ఆబిడ్సులో నివసించిన స్వంత యింటి పేరు Golden Threshold అనగా కాంచనదేహళి" లేక బంగారుగడప" అని యర్థము తిరుమలపై శ్రీ వేంకటేశ్వరుని దర్శించుటకు ప్రవేశించు ద్వారమునకు బంగారు వాకిలి" అనిపేరు వేంకటేశ్వరుడు తన బంగారువాకిలి" దాటివచ్చి బంగారు గడపలోనికి" అనగా హైదరాబాదు నగరమునకు వచ్చినాడని భావము

ఆతెసెన్నేతగురుజీ తానెతుగు మోఎ[17]

ప్రణవరేఖయు ముద్రించి ప్రభలుచిమ్మె

ధన్యమీధాత్రియంచును తరలినావొ

బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

వెల్లినెయిట్లు యెన్నెన్నొ వినుతుగాని

ఎందులేమీవు ! చాలు మావిందవైతి !

భాగ్యకలమంపుపరిగలపనవికొంటు

బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

శిరమునన్గంగ మఱి గంగచరణములను

చాలుపైగంగ విడువుము చరణగంగ

నీటియెద్దడి మాన్పుము నీటియందు

బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

17 రాష్ట్రియ స్వయంసేవక సంఘము (ఆర్ యస్ యస్) నాయకులు స్వర్గీయ పూజ శ్రీ గురూజీ గోల్వాల్కార్ ఒకసారి తుఫాను కారణముగ తమ ఆంధ్రప్రదేశ్ పర్యటన కార్యక్రమమును రద్దు చేసుకొని సికిందరాబాదునందలి ఘాన్మండీబస్తిలోని శ్రీ కొకా రంగనాధరావుగారు అను ఒక కారి కర్త యింటిలో అతిధిగా రెండురోజులు ఆగిపోవలసి వచ్చినది తుఫాను వెలసిన తర్వాత మరుదపరోజునాటి సాయంత్రము సాంధ్యరేఖల బంగారుకాంతులు మిలమిల మెరయుచున్న సమయములో వారు రాణిగంజిలో కొంతదూరము వాహ్యాళికై ఉదానముగా స్తిమితముగా నడచివెళ్ళుట జరిగినది ఆ పావన మధుర సుందర దృశ్యము చూసినప్పుడు కలిగిన దివ్యమైన అనుభూతియె యీ వర్ణన ఈ సంఘటన 1969 మే నెలలో జరిగినది

ఎకరుతంబుల తన కంఠపేటిఁదాల్చి
భ్రమర రవముం కంకణ రవళి నిల్పి
నగరము వసంతలక్ష్మి యనంగ నొప్పు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

కొండ గుడిచుట్టు నిలిచన కుజములవ్వి
మలయమారుతచాలిత మస్తగ్శత
కుసుమముల రాల్చి నీపైన కొలుచుచుండు
బిర్లమందిరవాస! శ్రీవెంకటేశ!

నీవు నిలిచిన నీలాద్రి నేలలందు
పళియలై మొల్చు లేఁలేత పచ్చిగఱిక
గరుడపచ్చలగిరి వోలెఁ బఱగనదియు
బిర్లమందిరవాస! శ్రీవెంకటేశ!

విరులు చివురులు ఫలములు కురియు సిరులు
పాలరాతి మందిరముపై ప్రతిఫలించి
వరవసంత చిత్రణ మహో పరిఢవిల్లు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

నారిహరంబగు నీమూర్తి హరిత తరువు
నల్లుకొనియున్న శాద్వల వల్లుల హహ!
సిరియు గౌరియు - సర్వము హరితమయము
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

నిత్యకల్యాణ మూర్తివౌ నిన్నుఁ జూచ
పచ్చనై పోవు హృదయముల్ భక్తతతికి
అదె వసంతము భక్తుల బ్రదుకులందు!
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

## గ్రీష్మర్తువు

వచ్చు నల్లన గ్రీష్మర్తు వచ్చు వడగ
పంచభూతము లెల్లను పగలు రేలు
క్రోధ శాంతములు మియుచు కోహటిల్ల
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

భూత పంచకమీరీతి పోకడలకు
హేతువేమేమొ పౌరులూహింత్రుగాని
నిజము నారయ సర్వము నీవ గదవె
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

పగలు చెఱిగెడు నెండల పొగరుఁ గాంచి
విసరు గాడ్పుల వెచ్చని బుసలనెంచి
నీదునిటలాక్షి గళనాగమూదునవెద
బిర్లమందిరవాస! శ్రీవె కటేశ!

రాత్రి కురిసెడు చందన రసము నరసి
వీచు తెమ్మెరల తఱగల విధముఁ దలచి
నీదు కందోయి శశివంచమూదునందు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

## ఋతుపూజ

నగిరి ఋతుచక్ర విలసన ప్రగతి అరసి
నీదు లీలావిలాసంబు కాదొ యిద్ది
యనగ నాశ్చర్యచకితులౌ జనులు పురిని
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

కొండగుట్టల లోయల గండశిలల
చెలువు దీవుల మఱి చెట్లచేమలందు
తోటతోపుల ఋతువులు త్రుళ్ళిపడును
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

తుల్యశీతోష్ణ సంస్థితి కల్యమౌచు
నద్దమట్లొప్పు ప్రకృతితో నందమైన
నగరి ఋతువులు సొగసుగా నటనమాడు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

కొన్ని యెడలను ఋతువులు కొలదిమీరి
పరిధి దాటుచు గడుసుగా పరిఢవిల్లు
చూడముచ్చట గొల్పును చోద్యమలర
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

## వసంతవర్ణన

ఇంద్రజాలము కాబోలు నిద్దిరనగ
సరిగ వలరాజసఖుడు వసంతుడరుగ
ప్రకృతి నిలువెల్ల పులకించి పరిమళించు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

పగలు పురుషుడు రాతిరి ప్రకృతి యంత్రు
వీరకాంతములుబికెతు వీనియందు
తంద్రి తల్లుల భావంబు తగును పోల్ప
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

పగలు వేధింప రాతిరి భద్రమిచ్చు
తండ్రి కోపింప తల్లితాదరికిఁ దీయు
నీవుకాదన్న శ్రీ దేవి నెనరుఁ జూపు[18]
బిర్లమందిరవాస ! శ్రీవెం౦ టేశ !

నీదు నిశ్వాస జనితోష్మ నాదమేను
ఎల్లభూముల నినదించి వల్లెయనగ
చేరుకొనియెద మఱిఁ\న్నె చివరికింక
బిర్లమందిరవాస ! శ్రీవే కటేశ !

## వర్షర్తువు

నేల గాలియు నిప్పును నింగి నీరు
చిమ్ముచున్నట్టి యావిరిసెగలు పొగలు
ఒక్కసుడుటున వర్షమై యోసరిల్లు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

18 శ్రీదేవి" దీనికి లక్ష్మియను సామాన్యార్థమునే గాక శ్రీవిద్య యందు ప్రతిపాదింపబడిన శక్తి" గౌరీదేవి యని కూడ అర్థము చెప్ప కొనవలెను

కుండపోతగ వర్షముల్ కురియుచుండ
సడిగ వడగళ్ళుపడ చుండు వడివడి ను
చుక్కలెల్లను తెగిపడుచున్నవనగ
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

చిన్నివడగళ్ళుకలబోయు సన్నజల్లు
మల్లెమొగ్గలు కలిసిన మంత్రజలము
నిన్ను నభిషిక్తుజేసెడు నేత్రమలర
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

ఇచటి వర్షంబులను గూర్చి యేమిచెబుదు
ఇట్టెవచ్చిన వర్షమదట్టెపోవు
అచటకురి వ మురిచటలేవు
బిర్లమ దిరవాస ! శ్రీవేంకటేశ !

పూలజల్లుగ నొకపరితూలిపోవు
గాలివానగ నొకమారు గోలచేయు
తీరుతియ్యములివియని తెలియలేము
బిర్లమంది స ! శ్రీవేంకటేశ !

ఆడుకొనునట్టిశిశువు తానదిరిపడుచు
ఏడ్పులంకించుకొను నట్టి చాడ్పుగాగ
ఉరుము మెరుపుల వర్షములుప్పతిల్లు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

ఏడ్పుపసివాడు రక్కున నేడ్పుమాని
లేతచిరునవ్వులొలికెడు లీలమెఱయ
వానవెలియును లేయెండసోనకురియు
బిర్లమందిరవాస! శ్రీవెంకటేశ!

నగరజడవేతనోద్భూతనాదభరిత
మారుతంబేను జగముల మారుమ్రోగి
పులకిపోయెద నీమూర్తి పులకరింప
బిర్లమందిరవాస! శ్రీవెంకటేశ!

## శరదృతువు

వర్షమాఱు శరత్తు, హర్షమొదవ
వానకడిగిన దిగ్భిత్తి వలయమందు
శాంత రమణీయతాస్థితి చవుకళింప
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

వానమసకలు తీఱిన వాసరముల
వరదతొగ్గును వంగును వరులు-ప్రకృతి
ప్రజకు వినయంబు నేర్పెడు భంగితోచు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

ముని యగస్త్యుడు తోచగ వినుపథమున
నీటి చెలమలు చెఱువులు పీటియంతు
చంద్రుడు విఱిగి ప్రసన్నమై వఱలుచుండు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

చారు కార్తిక పూర్ణిమా సూరవిధులు[19]
స్ఫాటికంబగు గుడిపైన ప్రతిఫలించి
చెప్పు పొరిపొరి కుతుకము చూపులందు
బిర్లమందిర వాస ! శ్రీవేంక టేశ !

దివిని తారలు భువియందు దీపతతియు
పోహళించెడు నా కాంతి పూరమందు
తడిసి మెఱిసెడు శారద తరళదేహ !
బిర్లమందిర వాస ! శ్రీవేంక టేశ !

శుక్లపక్షపు వెన్నెల శోభలకును[20]
కృష్ణపక్షపు చీకటి కీలలకును
కాదొ ! హేతువు నీదేహకాంతులరయ !
బిర్లమందిర వాస ! శ్రీవేంక టేశ !

నేను కవిరాజహంసను గాన మధుప
వరుడ నటమయూరంబను వక్త్రశుకమ
చెలగి శారదవేళ నిన్ చేరికొలుతు
బిర్లమందిర వాస ! శ్రీవేంక టేశ !

---

19 సూరవిధులు = సూర్యచంద్రులు

20 హరుని దేహకాంతి విభూతిపూతవలన తెల్లగానుండి శుక్లపక్షపు వెన్నెలకు కారణమగుచున్నది హరియొక్క దేహకాంతి నీలముగానుండుట వలన కృష్ణపక్షపు చీకటులకు కారణమగుచున్నది

## హేమంతఋతువు

అంత హేమంత ఋతువు తానవతరించు
మంచు తెఱలను దివినుండి దించు భువికి
తెఱలుదాటుచు తరణియు తరలివచ్చు
చిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

సూర్యకిరణాళి హిమకోష్ణ సుధలుజార్చి
ప్రకృతి యంతయు నీరెండ పండి పూయు
పతంగు వెన్నెలా ! చంద్రాతపంబొ ! యనగ
చిర్లమందిరవాస ! శ్రీవెంకటేశ !

చంద్రుడు చల్లెడు వెన్నెల జిలుగుమంచు
దిశలు కననీక పొగలగా తెరలుచుండు
మంచు వెన్నెల మవులమాద్రితోచు
చిర్లమందిరవాస ! శ్రీవెంకటేశ !

గడ్డకట్టినమంచులో కసఱు గాలి
వపను తాకును జిల్లని వణుకుపుట్టు
దంతవీణెలు మ్రోగును దవడలలయ
చిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

చెట్లయాకుల నిలిచిన చిటికెమంచు
గాలియూపగ చిటపట రాలిపడుచు
శ్రవణ సుఖముగ వినిపించు సరళిదోచు
చిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

ఉదయభానునకెదురుగా నులుసుపోక
గోడకానుక కూర్చుండి కుట్టుకారు
నోటియావిరు లూదుచు పోటి పడరె
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

నేదు హేమంత హిమబిందు వౌదునేను!
నీదు సన్నిధి నీలాద్రి నేలయందు
పచ్చిగడ్డిక౦పై నిల్చి పరవశింతు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

ఇందు జరిపిన ఋతుపూజయందు మఱియు
శిశిర మొక్కటె యున్నది శేషమింక
అదియు జరిపెద నిప్పుడె సదయ నీకు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

శిశిరర్తువు

ప్రకృతి ప్రసవించు ఋతుచక్రభంగులందు
శిశిరవిధమదిచిత్రము! సీతుహెచ్చు
నిశలు పొడవయి దినములు కృశములగును
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

సీతుబాధకు బెదరుచు జీవకోటి
వెచ్చదనమిచ్చు దుస్తులు వేసుకొనియు
నగరవీధుల వణకుచు నడచుచుంద్రు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

చలికినోర్వక భక్తులు సంజలందు
మున్నెపోవుదురిళ్ళకు నిన్నువీడి
దేవితోనీకు నేకాంతదీప్తు లొప్ప
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

నిశలశైత్యము వరముగా నివ్వటిలగ
సెజ్జఁజేరిన జంటలు పజ్జనొదిగి
ఒకరికొకరౌను చలిమంట లుహుహులలర
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

ఎన్నినాళ్ళింక చలియంచు నెంచుచుండ
వచ్చుమహరాత్రి శివరాత్రి ప్రభలువెలుగ
శివశివా ! యంచు చలిపోవు చిత్రముగను
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

ఆకులన్నియు రాలిన మ్రాకులవ్వ[21]
యగును శబరీ యపర్ణల యంగ యష్టు
లవియ పులకింపఁజేతువు హరిహరాత్మ !
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

21 హరిపక్షమున శబరి" హరపక్షమున అపర్ణ" అనగా **పార్వతి** యని యర్థము న+పర్ణ = అపర్ణ = ఆకులుకూడ తినక శివునికై తపస్సు చేసినది అంగయష్టి = దేహమనుకట్టి

నీడుపన్నిషి సిముసంబు నిలిచినంత
అంతరరిషట్కమొయెడు నెల్ల రాలు
అపుడె వైరాగ్య మధుమాస మావరించు
బిర్లమందిరవాస ! శ్రీవెంకటేశ !

## పండుగలు - జాతరలు

ఊరజరిగెడు నెన్నెన్నొయుత్సవములు
దైవదేశభక్తి స్ఫూర్తిదాయకములు
సర్వమానవ సౌభ్రాత్రసాధకములు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

విను యుగాదియు సంక్రాంతి విజయదశమి
రాఖి దీపావళి శివాజిరాజ్యదినము
వ్యాసపూర్ణిమ నవమియు వరలు నటులె
హోలి మహాకాళి గణపతియు బతుకమ్మ
బిర్లమందిరవాస ! శ్రీవెంకటేశ !

ఎంతొ గొప్పగ జరుగును చివ్వి కాని
హోలి మాంకాళి గణపతియు బతుకమలు
వరలు ప్రత్యేక జాత్రలై - వరుస వినుము
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

## హోలీ పండుగ

వచ్చె-ఫాల్గుణ పూర్ణిమా పర్వమందు
హోలి-హోలిరే రంగిహోహోలి సెమ్మ
ఖేలరే హోలి! యని మంది కేళిసలుప
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

చెంగుచెంగున నొండొరుల్ చెనకికొనుచు
పలురకంబుల రంగులు పులిమి చల్లి
సరసమొప్పగ సరిపోరు సఖుపుచుండ్రు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

హోలియాడుచు నాగరులూరఁ దిరిగి
పగటివేషాల వాండ్రుగా భ్రమనుగొల్ప
నగరమొప్పును నాటక రంగమనగ
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

పువ్వుబోడిని యెదదకు పొదివికొనగ
హోలిచిగురంటెనామెకు హొయలువిరిసె
నదియ తొలిహోలి వారికి మదినినిల్చె
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

కామదహనము ప్రొద్దున గ్రామమెదుట[22]
కామపూజలు రాత్రికి కాంతతోడ
చిత్రమీహోలి! నీ కథాచిహ్నమనగ
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

---

22 శివుడు మన్మథుని దహనముచేసె పార్వతిని పెండ్లియాడెను

## మహంకాళి జాతర

ఆల సికిందరబాదులో వెలసియున్న
తల్లి మహకాళి! యామెజాతరలు జరుగు
వేడ్కమీఱగ నాషాఢవిదియనాడు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

జాతరలఁజాటి దండోర చాటిఎంత
ఘటము లెత్తుచు బహువిధపటహములతో
చుట్టివత్తురు వీథుల చోద్యమలర
బిర్లమందిరవాస! శ్రీవెంకటేశ!

సరిగ జాతరనాడొప్పు సంబరమున
జానపదులు పురీజనుల్ సాగిరాగ
లష్కరంతయు నానందపుష్కలమగు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

జానపదకళారూపముల్ గానములును
వీథివీథిన వెన్నెన్నొ వెలయు నాడు
ప్రజలుగుమిగూడి దర్శించి పరవశింత్రు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

పళ్ళెరంబుల ఘటముల బండ్లపైన
తల్లి నైవేద్య సంభారమెల్ల దెత్తు
భక్తిపరవశలై వెంటపడతులరుగ
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

అమ్మసన్నిధి నైవేద్యమొప్పగించి
భక్తిమయులౌచు సాష్టాంగపడినయంత
దేవి సాక్షాత్కరించెడు తీరుగనమొ!
బిర్లమందిరవాస శ్రీవేంకటేశ!

కొండయందుండి కాంతువు కొసరికొసరి
నీదు ప్రతినిధి మహాకాళి నెయ్యమెల్ల
ఆమె గమనింపకుండునో యనుచుఁ దలతు!
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!23

---

23. హైదరాబాదు సికిందరాబాదు నగరములలో జరుగు బోనాల పండుగలోని భాగమే మహంకాళి జాతర. గొల్కొండలో మొట్టమొదట ఈ పూజ ప్రారంభమగును. అక్కడ ఆయిదవపూజ జరుగుచుండగా సికిందరాబాదు మహంకాళి జాతర ప్రారంభమగును. ఆ తరువాత తక్కిన బస్తీలలోను ఈ జాతరలు ముమ్మరముగాసాగును. సికిందరాబాదు మహాకాళి విగ్రహమును ఉజ్జయినీ నుండి తీసుకొనివచ్చి ప్రతిష్ఠించుట వలన దీనికి "ఉజ్జయినీ మహంకాళి" అని పేరు వచ్చినది.

ఈ పద్యములలో "బోనాలు" "చాకపోయడము" తొట్టెయెత్తుట రంగమెక్కుట పోతరాజు వేషము" బలిగంప" వేపమండలు" మొదలగు సంశములు కంఠోక్తిగా పేర్కొనబడలేదు. ఆయా విషయములను పాఠకులు మరింత వివరముగ జానపదసాహిత్య గ్రంథములనుండి తెలిసికొనగలరని మనవి చేయదమైనది.

## గణేశనిమజ్జనము

భాద్రపదశుద్ధచవితినాఁ బర్వమందు
వేనవేలుగ గణపతుల్ వెలయు నిచట
బహువిధాకృతి పరిమాణవర్ణములతొ
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

వేదఘోషలఁ బూజలన్ వివిధకథల
వాద్యఘోషల గీతముల్ ప్రవచనముల
నలరు నవరాత్రి సంరంభమారభటిగ
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

శ్రీగణేశనిమజ్జన శ్రీదినమది
పయనమైసాగు నాతడు-వాద్యములతొ
నగరమంతయు జైజైల నడచిరాగ
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

ఎన్నిదిక్కుల వచ్చునో యెవరికెఱుక!
ఎన్నిరూపంబులో చెప్పనేరితరము!
ఎన్నివిధతలఁ జేరునో యెట్లుతెలియు!
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

అల వినాయకసాగరమలలు సాచి
తల్లిబిడ్డలఁ గడుపులో దాచుకొనగ
పడు తహతహలతో-గణపతులఁ బిల్చు
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

అష్టదిగ్గజఘీంకృతు లావహించు
జనులజయలన్ మజ్జన జరుగుచుండ
నేటిరేపటి ప్రొద్దుల నీటుమధ్య
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

సిద్ధిగణపతి విష్వక సేనుతోఁ బె[24]
కొండపైనుండి చూతువు కొడుకుగొప్ప
తండ్రిపొందు పుత్రోత్సాహతమక మొప్ప
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

బతుకమ్మ పండుగ

వచ్చు దసరాలో బతుకమ్మ పండుగ బతు
కమ్మబతుకమ్మ ఉయ్యాలో అమ్మయనుచు
గాన మొనరింపఁ గమ్మగా కాంతలెల్ల
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

స్త్రీలు సౌభాగ్యమును గోరిచేయునట్టి
తల్లి గౌరమ్మ పూజలే ధరణియిట్లు
వరలు చుండుచు బతుకమ్మ పండుగనగ
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

---

24 గణపతి శివుని కొడుకు విష్వక్సేనుడు విష్ణువు సేనాధిపతి విశ్వాసపాత్రుడగు సేనాధిపతిపై విష్ణువునకు పుత్రవాత్సల్యము గలదను భావము ఇచట సూచితము

గునుగు గుమ్మడి తంగేడు కుసుమములతో
గోపురాకృతి నిర్మించి కొనకు నడుమ
పసుపు గౌరమ్మ నుంతురు భద్రముగను
బిర్లమందిరవాస ! శ్రీవెంకటేశ !

సాంధ్యవేళల వాకిళ్ళ సాన్పుజల్లి
రంగవల్లులు దీరిచి రమ్యసరళి
మధ్య బతుకమ్మనుంచి నమస్కరింత్రు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

ప్రమదలానంద గంధము పరిమళింప
అల్ల బొడ్డెమ్మలెయుచు నమ్మచుట్టు
ఆడిపాడుదురాకాంక్షలలరుచుండ
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

అంతనవరాత్రి తుదిరాత్రి సింతులెల్ల
వరుస నూరెరిగింపుతో బతుకమలను
సాగరములో నిమజ్జన సలిపవత్తు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

లలివినాయుం సాగరలక్ష్మి యనగ[25]
దోచు బతుకమ్మ సాక్షాత్తు దుర్గగాదె!
సిరియు గౌరియు చిత్తముల్ చిగురఁజేతు !
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

25 హైదరాబాదు నగరములో రెండు ముఖ్యమైన జానపదగాథలకు పుట్టుకస్థానములందన ప్రదేశములు రెండున్నవి

మైలారుగడ్డ ఇది సికింద్రాబాదు నందు సీతాఫల్‌మండికి దాపులో నున్న బస్తీ పూర్వమొకప్పుడిది "మైలారుదేవునకు" మైలారుభటుల శైవ మతావేశకృత్యములకు ఆటపట్టుగానుండెను దీని విషయమిప్పుడు అప్రస్తుతముగనుక విరమింపబడుచున్నది

బతుకమ్మకుంట హైదరాబాదు నగరమునందు నల్లకుంటకుదాపులో అంబరుపేట తిలక్‌నగరులకు దగ్గఱనున్న బస్తీ యిది ఇది బ్రతుకమ్మ జానపదగాథకు పుట్టుకస్థానము

కాకతిగణపతిదేవ చక్రవర్తియొక్క మంత్రి శివదేవయ గొప్ప రాజనీతిజ్ఞుడు శైవమతావలంబి అంతకుపూర్వము బ్రతుకమ్మను ఏ ఆకారములో నిర్మించుచుండెడివారో తెలియదు శివదేవయ్య శ్రీచక్ర నిర్మాణరీతిలో గోపురాకృతిలో నిర్మించుపద్ధతిని యేర్పాటుచేసెను అది మొదలుకొని యీపండుగ శక్తిపూజా వ్యవస్థకు సంకేతమై నిలిచినది వరంగల్లు ప్రాంతములో బ్రతుకమ్మను "మమ్మళ్ళమ్మ" అందురట

సాంధ వేళ వాకిళ్ళ సాప్పుజల్లి = సాయంత్రపు పూటలందు వాకిళ్ళలో కళాపుజల్లి

బొడ్డెమ్మలేయుచు = ప్రదక్షిణములుచేయుచు ఎగురుచు చప్పట్లు చఱచుచు పాటలుపాడుచు ఈ మొత్తము పద్ధతికి "బొడ్డెమ్మలేయుట" అని సంకేతింపబడినది "బొడ్డెమ్మ" అను మరొక జానపదదేవత గలదు ఇక్కడియర్థమది గాదని గ్రహింపగలరు

హైదరాబాదులో స్త్రీలు కోలాహలముగ బ్రతుకమ్మలను నవరాత్రుళ్ళ చివరిరోజున బండ్లమీద ఊరేగింపుగా తీసుకొనిపోయి వినాయక సాగరములో (హుస్సేన్ సాగరములో) కలిపివచ్చుట సుందరమైన దృశ్యము!

# నివేదనము

శేషశేషిత్వ భావనాస్థితిని గొల్చి
యెప్పుడెట్లెట్లు వలయునో యప్పుడట్లు
నీదు మూర్తుల వర్ణనల్ నెఱపితిచట
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

క్రొత్తగా వచ్చికూర్చున్న కూర్మిదొరవు
ప్రథమ భక్తుడనేనౌట ప్రథమ దశగ
ఊరి సంగతులొక కొన్నియేరిచెబితి
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

నీదు హుండీలొ వరహాలు నించుకరము
భిక్షుకుఁ బాత్రఁ గాసైన వేయిగాక
భక్తి-వర్తనలవి సరిపడగవలయు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

ప్రతిమలందున నినుగొల్చు ప్రతినరునకు
ప్రాణికోటుల నినుగాంచు ప్రణవమిమ్ము
జీవుడే మఱి దేవుడన్ చిత్తమిమ్ము
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

దేవమానవరులు దీనఁగలవు
దేవులందరు నొక్కటె తేడలేదు
మానవులుఁగూడ నొక్కటే మఱువరాదు
బిర్లమందిరవాస ! శ్రీవేంకటేశ !

అస్తి నాస్తుల విచికిత్సలంతరించి
అస్తి యనుమాట మంత్రమై యలరుగాక
అస్తి లేనిచో విశ్వంబె నాస్తి గాదొ!
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

సృష్టిసౌందర్య వైవిధ్య హృష్టులగుచు
వింత భళియంద్రుః మఱిదాని వెనుకనున్న
సత్యశివసుందరుండైన నిత్యు గనరు!
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

సమర్పణ

కావ్యరససమిద్ధి యిచ్చితిఁగనుము అల య
శోదమ స్తన్యముగనౌను! కాదయేని
కాలకూటంబుగానైన కాకపోదు!
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

నారికేళము వారించినాడ విచట[26]
నారికేళము నందూరు వారిభంగి
హృదయ మందూరు భక్తియే హృద్యమౌట
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

ఇదిగొ హృన్నారికేళము సదయ గనుము
భక్తి సలిలము మధురము భావమనెడు
కొబ్బరి మృదువు నైవేద్యమబ్బ! గొనుము
బిర్లమందిరవాస! శ్రీవేంకటేశ!

---

26 పైన కొబ్బరికాయ కొట్టనివ్వరు అందుకు కారణము చెప్పబడినది

## మంగళాశాసనము

నిన్ను వెలయించి సన్నుతి గొన్నయట్టి
సదరు బిర్లాకుటుంబము సభ్యులకును
వారి సంస్థ హిందుస్థాన ఛారిటీయను
ట్రస్టునకను సకలశుభ ప్రస్తవీవు
బిర్లమందిరవాస ! శ్రీవెంకటేశ !

## ఫలశ్రుతి

సాంబమూర్తి కౌసల్యల సత్సుతుండ
దేవపురుషుడు హనుమంతధిషణునకును
కవి పరీక్షిత శర్మకునవరజుండు
భ్రమరకున్ మఱి లక్ష్మికి భ్రాతయతడు
లబ్ధవర్ణుడు బుధజన లాలితుండు
రాణకోనేటి యచ్యుతరామ రచిత

బిర్లమందిర సుందరు వేంకటేశు
శతంమిద్యది యెవ్వారు శ్రద్ధతోడ
చదివి చదివింత్రు వారికి జయము గలుగు
ఆయురారోగ్య భాగ్యములధికమగును!

# డా॥ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి సాహిత్యము

1 శంకరాచార్య — పద్యకృతి 1958

2 బందాబైరాగి — చారిత్రక నాటిక 1959

3 సంస్కృత నాటక ప్రయోగ రంగము 1975
క్రీ శ 1874 - 1975 మధ్యకాలములో ఆంధ్రప్రదేశ్‌లో ప్రవర్తిల్లిన వందసంవత్సరముల సంస్కృత నాటక ప్రయోగ రంగ చరిత్ర పుటలు 132 వెల రూ॥ 10/-

4 స్నేహబంధనమ్ — సం స్కృత సాం [illegible]
పుటలు [illegible]6 వెల రూ॥ 2/-

5 హిమకిరీటిని — తెలుగు స్వీయకవితా సంకలనము 1981
పుటలు 48 వెల రూ॥ 3/-

6 స్వామీ వివేకానంద కవితావైభవం—సాహిత్యవిమర్శ 1988
వివేకానందుడు వ్రాసిన 26 సంస్కృత శ్లోకములకు 12 ఆంగ్ల కవితలకు అపూర్వమైన వ్యాఖ్యానము పుటలు 48 వెల రూ॥ 4/-

7 హైదరాబాదు నగర తెలుగు భాషాసాహిత్య వికాసచరిత్ర 1985 క్రీ శ 1518-1956 మధ్యకాలములో హైదరాబాదు నగరములో మాత్రమే తీవెలుసాగిన 450 సంవత్సరముల తెలుగు భాషాసాహిత్య వికాసచరిత్ర పుటలు 160 వెల రూ॥ 25/-

8 ఓగేటి వ్యాసపీఠి — అపూర్వములైన వివిధ పరిశోధనా సాహిత్యవ్యాసముల సంపుటి 1986 పుటలు 264
వెల రూ॥ 40/-
ఇందు "తిరుపతి వేంకటేశ్వర తత్త్వమే తిక్కన గారి హరిహరనాధ తత్త్వము" అన్న ఒక్క విషయమే 8 శీర్షికలుగా విభజింపబడి 108 పుటలలో పొందుపరుపబడినది

9 హైదరాబాదు నగర బిర్లామందిర వేంకటేశ్వర శతకము — ప్రస్తుత గ్రంధము

## ముద్రణలోనున్న గ్రంథములు

10 ఎఱ్ఱన అరణ్యపర్వశేషము – ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి 1988 లో డాక్టరేట్ పట్టము నొందిన పిహెచ్ డి సిద్ధాంతగ్రంధము

11 అచ్యుతగీత — సంస్కృత గేయ సంపుటి

12 Lady of the Lake — ఆంగ్లభాషలో తెలుగు జానపద కథల సంపుటి